రుధిరోద్గారినామ సంవత్సరము
శరదృతువు - కార్తీకము
నవంబరు నెల - 1983.

సర్వస్వామ్యములు రచయితవి.

ప్రథమ ముద్రణము
500 ప్రతులు.

మూల్యము :
నాలుగు రూపాయలు.

ముద్రణ :
'వేంకట రత్నా' విజయవాడ-2.

---

ప్రతులకు :
పి. దుర్గారావు, యం. ఓ. యల్.,
చెరుకుపల్లి పోష్టు, (వయా) నక్రేకల్,
నల్లగొండ జిల్లా.

# సమర్పణ:

మరో ప్రపంచం కోసం, మహా ప్రపంచం కోసం

మధుర స్వప్నాలను గాంచి,

అవి ఫలింపకుండానే కన్నుమూసిన

మహాకవి, మహామనీషి

శ్రీ శ్రీ గారికి

పూల దోసిళ్ళతో.



# వినయ వాక్యము

ఇందలి గేయములు చాలవఱకు ప్రబోధ గీతములు. కొన్ని మాతృ భక్తికి, దేశభక్తికి సంబంధించినవి. కొన్ని బాల గేయములు. ఇందలి గేయములలో నెక్కువ భాగము నవ సమాజమును గుఱించియు, శ్రామికవర్గ కష్టనష్టముల గుఱించియునై యున్నవి. కొన్ని గేయములు నా యితర రచనలనుండియు గ్రహింపబడినవి.

రంగు రంగుల పూలమాలవలె వివిధములైన భావము లతో గూడినవి కావుననే యీ గేయసంపుటికి 'పూల రథం' అని పేరు పెట్టుట జరిగినది.

ఈ గేయములు అప్పుడప్పుడు వ్రాసికొనినవి. అచ్చ టచ్చట కొన్ని కొన్ని గేయములు మహాకవి శ్రీశ్రీ భావము లను, శైలిని యనుకరింప యత్నించితిని. అందెంతవఱకు కృతార్థుడనైతినో తెలియదు.

ఇందలి గేయములు సహృదయులకు ఏమాత్రము హృదయ స్పందనము గావించినను ధన్యునిగా భావించు కొందును.

—రచయిత.

# నే పుట్టిన భూమిలో

నే పుట్టిన భూమిలో !
నే మెట్టిన ధాత్రిలో !
నవజీవన సంక్రాంతుల
నవయుగ ముదయించు టెపుడో!

అజ్ఞానపు టంధయుగం
అస్తమించు టెప్పుడో !
అరుణారుణ నవసంధ్యలు
అవతరించు టెప్పుడో!

ఆకలి దారిద్ర్యము లిల
అంతరించు టెప్పుడో !
దీనత్వపు, దాసత్వపు
దిగులు బాయు టెప్పుడో!

మత కుల మౌఢ్యములు మాసి
మమత విరియు టెప్పుడో!
పూర్ణ మానవత్వముతో
పొంగి పొరలు టెప్పుడో!

శాంతి, సౌఖ్యములను తొణుకు
సమ సమాజ మెప్పుడో !
భువి దివిగా మారి జనులు
పులకరించు టెప్పుడో !

# నా పాటలు

నా పాటలు! నా మాటలు !
నా భాషకు అంకితం !

నా తీయని భావములు
నా జాతికి అంకితం !

కుహూకుహూ మను, కిలకిల మను
కోకిల, చిలుకలను జేరి!
నా నేర్చిన పదము లన్ని
నా భూమికి అంకితం !

కొండలలో కోనలలో
కూర్చిన యీ గీతమాల !
మంగళాభి షేకములను
మాతృ దేవి కంకితం !

కృష్ణానది ముచుకుందలు
కూడిన పుణ్య స్థలమున!
తీరుగ వ్రాసిన పాటలు
తెలుగుతల్లి కంకితం !

చివురులతో, పూవులతో
చేర్చిన నా గీతిమాల !
కమ్మని తేనెల పాటలు
కన్నతల్లి కంకితం !

# వేలకొలది గొంతులు

వేలకొలది గొంతు లవే
ఎవరివి? ఎవరివి? ఎవరివి?

అణగారిన పీడిత ప్రజ
ఆర్తనాదమే! అదీ! అదీ!

పిడికిలి బిగియించి నడుచు
పీడిత ప్రజ యెచటి కీ పయనమూ?
సమజీవన సౌభాగ్యపు
శాంతి మందిరమున కీ పయనమూ!

వేల కాగడాల్ వెలుగగ
వెడలిన జను లెవ్వరూ? ఎవ్వరూ?
తుది లక్ష్యము సాధింపగ
కదిలిన జన వాహినీ! వాహినీ!

ఒకే పాట! ఒకే బాట!
ఒకే మాట ఎవరిదీ?
కష్టజీవు లంత గూడి
కలిపి గొంతు పాడిన పాటే యదీ!

జన వాహిని మేలుకుంది!
చైతన్యము నందికొంది! చైతన్యము నందికొంది!
సంపద లన్నీ తనవని
సత్యమునే తెలిసికొంది! సత్యమునే తెలిసికొంది!

# కడు చీకటి రాత్రి

కడు చీకటి రాత్రి యామె!
కాఱు మబ్బు లాక్రమించె!
దూర మేగు బాటసారి!
త్రుళ్ళి పడకు! వెను దిరుగకు!

పర్వతములు, నది నదములు,
పలు తెరంగు లడ్డంకులు!
అన్నిటి నీ వధిగమించి
అందుకొనుము! చిర లక్ష్యము!

చుక్కల రిక్కలను దాటి
సూటిగ చందురుని గడచి
దివి ధేనువు, కల్ప తరువు!
భువికి కానుకలుగ దెమ్ము!

తల్లి కోర్కె దీర్చుటకై
తరలుము! గరుడిని కైవడి
సరస విలాసములకు నిది
సమయము కాదని దలపుము!

నీ చేసిన ప్రతిన నిలుప
నిలువకు! నడు మున్ముందుకు!
సంఘ జీవితము మార్పగ
సమిధగ నర్పించుకొనుము!

# గుడి గంటలు

గుడి గంటలు మ్రోగినవి!
కొలువ రమ్మ! ప్రియ జనని!

మాతృపూజ సమయ మాయె
మధుర శంఖ నాదము లవె!

అన్నాతురు లదె గనుమా!
అలమటించు ప్రజ గనుమా!
కన్నీళ్ళను తుడిచి నీదు
కర్తవ్యము నెఱవేర్పుము!

హెచ్చు తగ్గులను మాపగ
ఉచ్ఛ నీచముల తుడువగ!
అచ్ఛమైన సుఖ సౌఖ్యము
లందఱి కందింప రమ్మ!

తనయుల వేదనల జూచి
తల్లడిల్లు తల్లి గనుము!
కన్నీళ్ళను తుడిచి మాతృ
కాంక్షలకై ముందుకు నడు!

మానవ సేవయె నిజముగ
మాతృ పూజగా స్మరింపు!
మనసులోని మమత ప్రేమ
మానవులకు నందింపుము!

# మనసులోని నా కోరిక

మనసులోని నా కోరిక
మఱి నిజముగ మారేనా ?

మాతృభూమి సేవ జేసి
మన్ననలను బొందుదునా ?

సంకుచితత్వము జయించి
సంఘ జీవితమును మార్చ
సాధు పురుష సాంగత్యము
సంబంధము గలిగేనా ?

నేనూ ఒక వీరుడనై !
నేనూ ఇక ధీరుడనై !
నవయుగ నిర్మాణమునకు
నా ప్రాణము లొడ్డుదునా?

వికృతులను పరిహరించి
ప్రకృతులను సాధింపగ!
అంతిమ సంగరమునందు
నాహుతిగా బలి యగుదున?

నవసమాజ ముద్భవించి
నవకాంతులు పరిఢవిల్లి !
నా సమాధిపై మల్లెల
నా ప్రజ వర్షించేనా?



వు. ల.

# సుందర శ్రీ జయ భారతి !

సుందర శ్రీ జయ భారతి!
వందన మిదె స్వీకరింపు!

నిండు భక్తి తోడ నిచ్చు
నీరాజన మందు కొనుము!

అడుగడున పుణ్యస్థలము
లలరు పుణ్య భారతమ్మా!
అణువణువున దివ్యత్వము
నందిన నా జన్మభూమి!

ఉదయాస్తాచలములతో
ఉన్నత హిమ గిరులతోడ!
గంగా యమునా కృష్ణలు
గలగల ప్రవహించు ధాత్రి.

వివిధ జాతి మతములతో
వివిధ సంస్కృతులూ, భాషలు
విలసిల్లిన జన హృదయాల్
వేడ్క నొక్కటిగ జేసిన!

యుగయుగాలు నీ యొడిలో
నూయ లూగ నా కోరిక!
జన్మ జన్మములు నీకే
జనియింపగ నాదు వాంఛ!

# నవ భారత యువకులార!

నవభారత యువకులార!
యువ భారత పౌరులార!

నవ చరిత్ర నిర్మింపగ
నడవండీ! నడుము గట్టి!

కోటి కోటి గొంతులతో
కొనియాడుచు మాతృభూమి!
జన మంతా ఒకటేనని!
జన్మభూమి ఒకటేనని!

మత కుల భేదములు మాపి,
మమత, ప్రేమ వెల్లివిరియ!
స్నేహ గీత మాలపించి
జాగృతి నిల వెలయింపుడు!

సమ సమాజ స్థాపనకై
సాంఘికాభ్యుదయమునకై
జనులందఱు సుఖము నొందు
జగతిని నిర్మింపుదము!

మాతృదేశ రూపు దిద్ది
మలుపుద మొక క్రొత్త బాట!
శాంతి సౌఖ్య సుఖ జీవన
కాంతిరేఖ లలుముకొనగ!

# ఒక్కటేరా!

ఒక్కటేరా! యీ ప్రపంచం!
ఒక్కటేరా! జన సమూహం!

ఒక్కటేరా! ధరణి, సంద్రము
లొక్కటేరా! గగనతలమూ!

వర్ణ భేదము లేలరా? యీ
వర్గ భేదము లేలరా?
మతము కులముల వేఱుబాటులు
మార్పు ముందుకు సాగరా!

మానవత్వం ఒక్కటేరా!
మనిషి జీవన మొక్కటేరా!
మనుషు లందఱు అన్న దమ్ములు,
మమత, స్నేహము పెంపరా!

తెలుపు నలుపు, తూర్పు పడమర
దేశ భేదము లేలరా!
విశ్వ మంతా ఒక ప్రభుత్వము
వేడు కలరగ నిలుపరా!

మారణాయుధ యుద్ధములలో
మనిషి జీవన మేలరా?
కలిమి లేముల నొక్కటగుదము
కష్ట సుఖముల పంచుకొందము!

# నేనూ ఒక వీరుడనై

నేనూ ఒక వీరునిగా!
నేనూ ఒక కేతనమై

నా జాతికి నవ పథముల
నడిపింపగ నాదు కోర్కె!

దుర్భర దారిద్ర్యబాధ
దూరముగా బారద్రోలి
అసమానత లంతరింప
అందఱి నొక బాట నడుప!

వెన్నెల వలె పువ్వుల వలె
వెలయింపగ నవ ధాత్రిని!
పయనించే ప్రగతి సేన
పై రెప రెప నెగుర వాంఛ!

ఎన్ని నష్టములు రానీ!
ఎన్ని నష్టములు రానీ!
వెనుదిరుగని యాత్మ శక్తి
వెలయింతును! ప్రతి నిమిషము!

వీరుల ప్రాణము నేనై!
ధీరుల గమ్యము నేనై!
వీరుల జయ జయ గీతల
వెలయుచుండు గగన సీమ!

# క్రొత్తయుగం

క్రొత్త యుగం స్థాపింపగ
కోరిందీ జన సంఘం!

క్రొత్త జగం నిర్మింపగ
కోరిందీ! యువశక్తీ!

క్రొత్త తీపి వాసంతము
కోకిల పాటలను వినగ!
క్రొత్త చిగురు, క్రొత్త పూలు
క్రొత్త ఫలము లందుకొనగ!

చేయి చేయి కలిపి జనం
చేరిం దొక మైదానం!
భుజం భుజం కలిపి జనం
పూనిం దొక వీర ప్రతిన!

సాంఘిక జీవనము మార్చి
శాంతిని ధర వెలయింపగ!
అడుగడుగున రక్త మొలుక
అశ్రువులను చిందింపగ!

ఆప లేరు! మాప లేరు!
అడ్డంకుల నిలుప లేరు!
ప్రాత మాసి, క్రొత్త వెలసి
పల్లవించు నూత్న జగతి!

# రథచక్రాల్

అధిగమించు రథ చక్రాల్
అడ్డు గోడ లాప లేవు!

పయనించే పూల రథం!
పథము తప్పి యాగిపోదు!

కొత్త జగతి నిర్మింపగ
కూడిన యువ సంఘమునకు
వాహనమై, జీవనమై
వర్థిలు నీ పూల రథం!

చెట్టు పుట్ట లధిగమించు
మిట్ట పల్లములను దాటు!
కొండ కోన లధిగమించు
కూడగ తన ప్రస్థానము!

రక్తాశ్రువులను తొణుకుచు
రమ్యపథము చేరుకొనగ!
క్రాంతి సైన్య వీరవరులు
కదిలి రాగ! ముందు! వెనుక!

శత్రువులను పరిహరించి,
శాంతి పతాకము ధరించు!
నవ సమాజ స్థాపనకయి
నడిచే దిది! పూల రథం!

# ఉదయించే సూర్యరథం

ఉదయించే సూర్యరథం
ఉక్కు గోడ లాపలేవు !

రమ్య సంధ్య వెలుగులను
రాత్రి తెరలు నిలుపలేవు !

మధు వసంత మాధురిలో
మలయ వీచి నాపలేరు !
వికసించే పూవులలో
వెలయు గంధ మాపలేరు!

ఉరుములోని ఘనగర్జన
మెరుపులోని తళతళలు !
జలలోని యలల తెరల
నిలువరింప నెవరి తరము?

పయనించే కాలచక్ర
పథము నెవరు ఆపలేరు !
కదిలిపోవు క్రాంతిసేన
కడ్డు నిలిచి గెలువలేరు !

వేగుచుక్క ఉదయించును !
వెలయు ధరణి కాంతి శాంతి !
అరుణకాంతి వెలుగులలో
ఆడిపాడు క్రొత్త జగతి !

# సూర్య చంద్రులు

సూర్యచంద్రులు అగ్ని వాయువు
సుందరంబగు ప్రకృతి సంపద !

నరుని కొఱకే! నరుని కొఱకే !
నవ్య జీవన గమ్యమునకే !

నదులు, వాగులు పర్వతములు,
నాట్యమాడే పంట పొలములు !
మనిషి కొఱకే ! మనిషి కొఱకే!
మధుర జీవన గమ్యమునకే !

సిరులు, సంపద ప్రకృతి విభవము
చిత్రమగు నాకాశమంతా !
నరుని కొఱకే ! నరుని కొఱకే !
నవ్యజీవన గమనమునకే !

మనుజు లందఱు ఒక్కటే యని
మాధవుడు దయతలచి యిచ్చిన
కానుకల మన మందఱమును
కలిసి కట్టుగ యనుభవింతము !

సోదరత్వము, మానవత్వము
సుఖము, శాంతులు వెల్లివిరియగ !
అందమగు ఒక నూత్న జగతిని
ఆలపింతము శాంతి గీతము!

# మాతృదేశ జాగృతికై

మాతృ దేశ జాగృతికై
మరణించిన ధీరు లెవరో ?

అంజలులను నే ఘటించి
యర్పించెద పూదోసిలి !

సమభావము, శాంతి కొఱకు
సర్వ మెవరు సర్పించిరో ?
అణువణువున దేశభక్తి
యలరిన పుణ్యాత్ము లెవరో ?

మానవ సౌభాగ్యమునకు
మది నెవ్వరు విలపించిరో ?
అడ్డు గోడలన్ని గూల్ప
నాహుతిగా బలి యైరో ?

ఉరికంబము లెక్కుటకును
ఉన్నత శిక్షలు భరింప!
రక్తమొలికి ప్రాణ మిచ్చి
రాజిల్లిన ధీరు లెవరో ?

అజ్ఞాతపు వీరులార !
అందుకొనుడు! పూ దోసిలి !
మీరు చేసిన యాత్మార్పణ
మేదినిపై నిలుచు నెపుడు !

# నా దేశపు క్రాంతిసేన

నా దేశపు క్రాంతిసేన
నా పాటే పాడాలి !

నవ్యజగతి వేదికపై
నా వీణే మ్రోగాలి !

సమభావం, సౌహార్ద్రం
శాంతి పథములను గూర్చి,
ఉల్లాసము, ఉత్తేజము
ఉల్లసిల్లు నా గీతిని !

కష్టాలను నష్టాలను
కర్తవ్యము బోధచేసి !
చీకటిలో వెలుగు చూపు
చింత బాపు నా పాటను !

నవజీవన నాట్యరంగ
నవ్యజగతి వేదికపై
నా రాగం ! నా తాళం !
నా స్వరములు పలకాలి !

బంగరు తీగెల నుండీ
బయలు వెడలు నా స్వరములు!
నా ప్రజలను నడిపించే
నవశక్తిగ మారాలీ !

# కూర్చిన ఈ మేడలు

కూర్చిన యీ మేడలన్నీ మీవే! మీవే! మీవే!
కూలే యీ గుడిసె లన్నీ మావే! మావే! మావే!

పండిన యీ పంటలన్నీ
నిండిన యీ సంపదలు!

కష్టింపక ననుభవించు మీవే! మీవే! మీవే!
వస్తులతో రోదించుట మాదే! మాదే! మాదే!

విలాసాల విందులతో
విలువైన దుస్తులతో

ఆటలతో నడుచు బ్రతుకు మీదే! మీదే! మీదే!
పాటులతో కలత బ్రతుకు మాదే! మాదే! మాదే!

అజ్ఞానం, దారిద్ర్యం
అంధకార దాస్యంలో

చాకిరితో నడుచు బ్రతుకు మాదే! మాదే! మాదే!
సంపదలను కులుకు బ్రతుకు మీదే! మీదే! మీదే

పదిమందికి మేలుకలుగు
ప్రగతి రాజ్య మొచ్చేనా?
సమ భావం, సమ న్యాయం
సంఘము ముద్భవించేనా?
ఇంటింటను దీపములను
ఈ ధర విలసిల్లే నా?

# చిలుక తల్లి

చిలుక తల్లి చెప్పిందీ
ఒక జోస్యం! ఒక జోస్యం!
చిలుక తల్లి పలికిందీ!
ఒక వాక్యం! ఒక వాక్యం!

పదిమందికి మేలు గలుగు
ప్రగతి రాజ్య మొచ్చెనని!
ఆకలితో నల్లాడే
యార్తులింక నుండరనీ!

హెచ్చు తగ్గు భేదము లిక
విచ్చిపోవు ననుచు బలికి
అచ్చమైన ప్రగతి ఫలము
లందరనుభవింతు రనుచు!

సోమరులకు తావు లేని
పామరులకు నీడ లేని!
శ్రమియించే రైతు కూలి
శాంతిరాజ్య మొచ్చె ననుచు!

పచ్చని తోరణములతో
ప్రతి యింటను కాంతి శాంతి!
కోరిన కోరిక ఫలించి
క్రొత్త జగతి వచ్చెననీ!

# వేలగొంతు లఱచినవి

వేల గొంతు లఱచినవి !
వేల శిఖలు మండినవి !

ఆటు పోటు అలల తోడ
అఱచిందీ కడలి పొంగి !

దౌర్జన్యం దౌష్ట్యాలను
తరలింపగ పుడమి నుండి !
సమ భావం, శాంతి కొఱకు
సర్వ జనం కదిలిందీ!

మానవత్వ శిఖరాలకు
మంచి బ్రతుకు బాట కొఱకు !
ఇంటింటను కాంతి విరియ
యిలను స్వర్గ సీమ జేయ !

అందఱి సుఖశాంతి కొఱకు !
అడ్డంకుల నధిగ మించి !
రక్తధార లశ్రువులను
రంజింపగ నడుము కట్టి !

భూమ్యాకాశములు రెండు
పులకరింప నవకాంతులు !
క్రొత్త చిగురు పూవులతో
కోటి వసంతాలు కోరి !

# కనుగొనరా

కనుగొను ! పీడిత ప్రజ హీనస్థితి
వినగొను ! శ్రామిక ఆర్త నాదములు !

కంటికి మంటికి నేక ధారగా
కన్నీళ్ళను రాల్చే ప్రజాళిని !

దినమంతా శ్రమియించి డస్సినా
దీనులు, పేదలు, పీడిత జనాళి !
అర్థాకలితో నావు నావురను !
అఱచి కేక లిడు నార్తుల గనుగొను !

కూడు గుడ్డలకు, కొంపా గోడికి
చదువు సంధ్యలా సారము లేని!
బ్రతుకే బరువై బాధల కుమిలే
ప్రజా సమూహపు వెతలను కనుగొను !

వేడి గాడ్పులను, చలి గాలులలో,
జడిగా కురిసే వర్ష ధారలను !
బాధల సహించి, వేదన భరించి
బ్రతికే జీవుల బాధల గనుగొను !

మనిషి బ్రతుకు యిక మారే దెప్పుడు ?
కను కొనలందున కాంతు లెప్పుడు ?
చిఱునగవులను చిందే దెప్పుడు?
చిర శాంతులు ధర నిలిచే దెప్పుడు ?

# పాడరా

పాడరా నీ జాతి గీతం!
పాడరా నీ ప్రగతి గీతం !

కోటి కోటి గొంతుకలతో
కూడి పాడర! శాంతి గీతం !

మనుషులంతా ఒక్కటేనని
మతములన్నీ యొక్కటేనని!
సమ సమాజం ! సంఘ ప్రగతి!
శాంతి కాంతి ఆశయంబని !

మానవత్వం, సోదరత్వం
మమతలే మా ఆశయాలని !
ప్రజలు జయ జయ గీతి పాడగ
బావుటా పై కెగుర వేయర !

దీప కాంతులు వెలుగగా, నవ
దీప్తి ప్రజలను విరియగా, శుభ
గీతములు దశ దిశలు నిండగ
ప్రీతి పూవులు పరిమళింపగ !

అందఱిది యీ భూమి, గగనము
అందఱిది యీ ప్రకృతి సంపద !
ప్రజల యాశలు కలలు పండే
ప్రగతి రాజ్యం ఆశయం బని !

# ఆకాశపు టంచులలో

ఆకాశపు టంచులలో
అలరే ఓ కాంతి రేఖా !

మానవులకు ఆశలు పండే
మంచి దినం వచ్చే దెప్పుడు ?

అన్యాయం అక్రమాలు
అణిగి పోవు శుభదిన మెప్పుడు ?
శాంతి కాంతి పూవులు పూచే
సౌఖ్య ఫలము లొందే దెప్పుడు ?

బీదల పాటులు నశియించి
పేదల కన్నీరు నిలిచి !
సమ భావం సౌహార్ద్రములు
జగతి నిండు రోజుల వెప్పుడు ?

అమవస నిశ లంతరించి?
అందములకు వెన్నెల లెపుడు ?
ఆకు రాలి క్రొత్త చివురులు
అంకురించు ఆమని యెపుడు ?

ధారుణీ యుద్ధాగ్నులు నిలిచి ?
ధరణి శాంతి పొందు టెప్పుడు ?
ఒకే తల్లి పిల్లల వలె ప్రజ
ఓలలాడు ఆ దిన మెప్పుడు?

# ఎక్కడివీ సంధ్యాకాంతులు

ఎక్కడివీ సంధ్యాకాంతులు?
ఎక్కడివీ నూతన వెలుగులు!

ఆకాశము నావరించి
ఆనందపు రేఖలు విరిసెను!

అరుణారుణ నూతన జ్యోతులు
అన్నిదిశలు అరుణారుణమై!
చీకటి పెను తెరలను మాపీ
చిర దాస్యములను ధర మాపెను!

ఎక్కడివీ బంగరు కాంతులు
చక్కని చందురునికి మల్లే!
చిక్కని వెన్నెల కిరణములను
చిఱునగవులు చిందగజేసెను!

ఎక్కడివీ తీయని పలుకులు
మక్కువలను గ్రుమ్మరించును!
కర్తవ్యములను బోధించి
కార్యోన్ముఖులనుగా జేయును!

క్రొత్త యుగం రాబోతోందని
క్రొత్త జగం వస్తూ వుందని!
నవనాటక రంగస్థలమున
నటి పలికే నాందీ గీతము?

# ప్రాచిం దొక నవ పద్మం

ప్రాచిం దొక నవపద్మం
పుష్పొడులను సుగంధములతో!

మకరందం కాల్వలు గట్టి
మాధుర్యములను విరిసింది!

కోటికోటి నవ కాంతులతో
కోటికోటి పూ రేకలతో!
ఝుమ్మని అదె కోకిల బారులు
కమ్మగ నాట్యములను సలిపెను!

ఎఱ్ఱని పూ రేకులన్నీ
ఎగిరి తరులు, గిరులను నిండి
రక్తాంకురముల వలె నింగిని
రమ్య పంక్తు లుదయించెనుగా!

పండుటాకు లన్నియు రాలి
ప్రసవ మొందె క్రొత్తని చివురులు
పచ్చని వసనముల నీ ధరణి
బాలింతగ వలె కనుపట్టెను!

పెనుచీకటి మాసెను జగమున
ప్రేమ మందిరముగా మారెను!
ఆకలి, అజ్ఞానము, పీడన
అంతరించె! యీ ధర నుండి!

# ఆ మహోదయము

ఆ మహోదయ మెప్పుడెప్పుడు?
ఆ మహోత్సవ మెప్పు డెప్పుడు?
దివికి భువికీ నిచ్చెనలు పడి
కవులు పలికిన పలుకు నిజమగునా?

పెనుతుఫానులు అంతమొందీ
పెను తరంగము లాగిపోయీ!
పూల పడవా దరికి జేరీ
పులకరించిన కలలు నిజమగునా?

కాఱుమబ్బులు అంతమొందీ!
కటిక చీకటి మాసిపోయి!
బాటసారి కోట జేరే
పర్వదినము ఆగమిస్తుందా?

రోదనలు, వేదనలు మానీ
బీద తనమూ మాటు మణిగీ!
మానవత్వము; మనిషి విలువలు
మహిని వెలిసే సమయ మొస్తుందా?

కవులు వ్రాసిన పలుకు నిజమై
కమ్మనౌ వాసంత మొచ్చేనా?
పూలుపూచీ క్రొత్తకాంతుల
పుడమి నూత్న ప్రపంచ మయ్యేనా?

# నా జీవిత మాధుర్యము

నా జీవిత మాధుర్యము
నా భూమికి యంకితమై!

నా శరీర మగు గావుత!
నా ప్రజలకు కానుకగా!

అలల నదీ నదములందు
జలరి యల్ప బిందువునై!
పంటపొలము లందు దొరలు
భాగ్య రేఖ నలుగుగాత!

ఆకలితో నలమటించు
అన్నాతురు డైన వ్యక్తి!
పిడికె డన్నమై యాతని
కడుపు మంట దీర్తు గాత!

వెన్నెల రేఖను గావుత!
వెన్నెల వెలయింతును ధర!
మావిలరువు నా గావుత!
మకరందము వర్షింతును!

క్రొత్త జగతి కోరిన ప్రజ
కూడి నడుచు పథములందు!
చల్లని చలివేంద్రమునై
సలిలము లందింతు గాత!



పూల

# మండే యీ మొండెములు

మండే మీ మొండెములు ఎవరివీ?
నిండిన కొలనుల రక్తము ఎవరిదీ?

సవ్యజగతి కయి పోరిన
నవ యువకుల బలిదానములే యివీ!
నవ యువకుల బలిదానములే యివీ!

ప్రవహించే స్వేదాశ్రువు లెవరివీ?
పైకి లేచు రుధిరధార లెవరివీ?

దేశమాత పిలుపును విని,
దీనుల యాక్రందన కని,
అన్యాయముతో పోరిన
అమర వీరు లశ్రు జలధులే యివీ!
అమరవీరు లశ్రు జలధులే యివీ!

లేచిన యీ ధూమ ధ్వజము లెవరివీ?
పూచిన శిఖి యరుణజ్వాల లెవరివీ?

అలమటించు ప్రజల కొఱకు
అగ్నిపరీక్షలకు నిలిచి
ఆహుతియై పైకి లేచు
అమరవీరు లాత్మార్పణలే యివీ!
అమరవీరు లాత్మార్పణలే యివీ!

కట్టిన యీ చిర సమాధు లెవరివీ?
పెట్టిన బంగారుగోడ లెవరివీ?

సమసమాజ స్థాపనకై
జరిపిన పోరాటములో!
ధరణి కొరిగి మరణించిన
ధీరవరుల స్మృతి చిహ్నములే యివీ!
ధీరవరుల స్మృతి చిహ్నములే యివీ!

వినిపించే వీరగీత మెవరిదీ?
ధ్వనియించే మేలుకొలుపు లెవరివీ?

కలిసి మెలిసి నడువమనీ
కలలను సాధింపమనీ!
క్రొత్త జగతికై పోరిగిన
కోటి గొంతు లఱచే ధ్వనులే యివీ!
కోటిగొంతు లఱచే ధ్వనులే యివీ!

మండే యీ మొండెములు ఎవరివీ?
నిండిన కొలనుల రక్తము ఎవరిదీ?

నవ్యజగతి కయి పోరిన
నవయువకుల బలిదానములే యివీ!
నవయువకుల బలిదానములే యివీ!

# ఆగష్టు పదిహేను

ఆగష్టు పదిహే నీనాడే!
అందఱి పండుగ యీనాడే !

పరదేశీయుల పాలనతొలగిన
భవ్య పర్వదిన మీ నాడే !

కాఱు చీకటులు క్రమ్మిన మబ్బులు
కడకు తొలగినది - యీనాడే !
చిరదాస్యముచే చివికిన దేశము
స్వేచ్ఛను పొందిన దీనాడే!
పరదేశీయులతో పోరాడీ
పారించిన తమ రక్తధారలను !
కోటి కోటి భారత మహాప్రజకు
కూడిన విజయము ఈనాడే !

తెల్లదొరల పాలన తొలగించి
ఉల్లము పొంగగ వినువీధులలో !
జాతిపతాకను ఎగురవేసి, జయ
గీతిని పాడిన దీ నాడే!

ప్రగతి, అభ్యుదయ, కాంతి శాంతులే
భారతప్రజల మనోరథం బనుచు!
భూ నభోంతరము ప్రతిధ్వనింపగ
పూనికి చాటినది యీనాడే !

# కనిపించే కాంతిరేఖ

కనిపించే కాంతి రేఖ!
కాంతులెపుడు ప్రజ్వలించు ?
వినిపించే మర్మ ధ్వనులు
వీరగీత మెపు డగునో ?

చిఱుమబ్బులు విస్తృతమై
మెఱుపులు విరబూచు టెపుడు ?
పెనుగాలులు, ఉఱుములతో
వినువీధులు నిండు టెపుడు ?

అంటిన యీ యగ్నిశిఖలు
నాకస మెపు డలుము కొనునో?
పరుగెత్తే నాగుబాము
పడగవిప్పి నిలుచు టెపుడు ?

అలిసిన యీ క్రాంతిసేన
అంబరమున కెగయు టెపుడు ?
తనదేనని యీ దివి భువి
వినిపించే సమయ మెపుడు ?

ఆకురాలు శిశిర ఋతువు
అంతరించి మాయు టెపుడు ?
నవ వసంత చిగురు పూల
నవయుగ ముదయించు టెపుడు ?

# వెలిగించిన దీప కళిక

వెలిగించిన దీపకళిక
వేయికాంతు లొలకాలి !

పలికిన యీ భావగీతి
పదిమందీ పాడాలి !

అఱచిన నా పిలుపును విని
అందఱు దరి జేరాలీ!
మాతృమందిరమును జేరి
మధురగీతి పాడాలీ !

సంఘ జీవితమును మార్చి
సమ సమాజ స్థాపనకై
అంజలి ఘటియించి ప్రజలు
అలరి ముందు కురకాలి!

ఆకలిచే పీడితులై
అలమటించు ప్రజలకొఱకు
నడుముకట్టి కదము ద్రొక్కి
నవయువకులు కదలాలీ!

నవ ప్రపంచ వాహినితో
నా దేశం నడవాలీ !
నవసంధ్యల మొలకలవలె
నా ప్రజలే మొఱవాలీ !

# శ్రమియించే శ్రామికుడా

శ్రమియించే శ్రామికుడా !
శ్రమ లెప్పుడు తప్పునురా ?
నీ శ్రమ ఫలితము లెప్పుడు
నీ చేతికి చిక్కునురా ?

ఈ గనులు, ఈ మరలు,
ఈ భువి చక్రములన్నీ !
నీ కరముల బలిమిని గద !
నిఖిలమంత కదిలి నడుచు !

స్వేదాశ్రువులను వొలుకుచు
చిరదాస్యము లొనరించుచు !
ఆకలితో, వేదనతో
అలమటించు జీవితము !

కరముల, నరముల సత్తువ
కనకములను సృజియింతువు !
యంత్ర భూత అధిపతులకు
నాహుతిగా బలియౌదువు !

జగతి సర్వ సంపదలు
శ్రామికుడా ! నీవేరా !
నీ హక్కులు ప్రకటింపుము !
నీ రాజ్యము స్థాపింపుము !



పూ ల

# అందఱము

అందఱము ఒకటే-మన
మందఱము ఒక్కటే!

భరతమాత పుత్రులము!
భరత దేశ పౌరులము!

కన్యాకుమారి నుండి
కాంచనగంగల వఱకును!
అన్నదమ్ములను భావము
అలుముకున్న దొక్కటే!

మతము, కులము వేఱయినా
మాతృమూర్తి ఒక్కటే!
వేష భాష లేమైనా
విడని సూత్ర మొక్కటే!

యుగ యుగాలు గడిచినా
జగ జగాలు మారినా!
ఆరిపోని మన దీపము
అలరింతము నవరంగుల!

వెలుగుదారి పయనింతము
వెలయింతము శాంతి కాంతి!
భారత మాతకు జయ మని
పలుకుద మందఱ మొకటై!

## కదిలిందీ

కదిలిందీ ! జనం ! జనం !
అదిరిందీ ! భూమి తలం!

మానవ ప్రస్థానమునకు
మలుపు తిరిగి నడిచిందీ !

విప్పిందీ! గళం! గళం!
వేల గొంతు లొక్క టొక్కటై!
పాడిందీ! పదం! పదం!
పది మందికి శుభం! శుభం!

సమ భావం శాంతి కాంతి!
సహా జీవన మాశయమని!
పట్టిందీ హాలం! కలం!
పది మందికి ఫలం! బలం!

చిర దాస్యం వినం! వినం!
చీకు బ్రతుకు భరం! భరం!
కలిపిందీ! కరం! కరం!
కనుగొందీ! నూత్న పథం!

ప్రాత యుగం గతం! గతం!
ప్రాత బతుకు కనం! కనం!
ముందడుగే క్రమం! క్రమం!
అందరికీ జయం! జయం!

# మేలుకుంది

మేలుకుంది యువశక్తి!
మేలుకుంది జనశక్తి!

కొత్త జగం రావాలని
కోరుతోంది గళం విప్పి!

నవ సంధ్యలు మొలకలెత్తి
నవోదయం రావాలని!
నవ భానుని స్వర్ణ కాంతి
నలు దిశలను తొలకాలని!

క్రొత్త చివురు వేయాలని
క్రొత్త పూలు పూయాలని!
క్రొత్త వసంతం జగతికి
కోటి కాన్కలీయాలని!

ద్వేషాగ్నులు, యుద్ధాగ్నులు,
ఈర్ష్య లంతరించాలని!
పుడమి పుణ్య భూమిలాగు
పులకరించి మెఱవాలని!

జగమంతా స్నేహ మయం!
యుగమంతా శాంతి మయం!
సాంఘిక జీవన మంతా
సరికొత్తగ మారాలని!

# చిరంజీవులార

చిరం జీవులార! ఓ
చిర సమాధులార!
మాతృ దేశ ముక్తి కొఱకు
మరణించిన యోధులార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

స్వారాజ్యము సాధింపగ
సమరములో దూకినా!
రక్తమొలికి ప్రాణమొడ్డి
రాజిల్లిన యోధులార!

మీ కివె నివాళులు!
మీ కివె జోహారులు!

నిరంకుశుల నెదిరించిన
వీర యోధులార!
ఉరికంభము లెక్కిట్టి
ఉక్కు పిడుగులార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

తల్లి చెఱను విడిపింపగ
తరలి పోరి శత్రులతో!
వీర మరణ మొందినట్టి
వీర వనితలార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

మతకుల భేదములు లేని
మరో జగతి నిర్మింపగ!
పోరాటములో వొరిగిన
పుణ్య పురుషులార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

చిందించిన మీ రక్తము
చెరిగిపోదు యీ నేలను!
మీ త్యాగములను మఱువము
మీ బలిదానము మఱువము!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

# ఏడు రంగు లలరిన

ఏడు రంగు లలరిన యీ
యింద్ర ధనుసు ఎవరిదీ?
దివిని భువిని కలిపిన యీ
దివ్య చాప మెవరిదీ?
పీడిత ప్రజ యార్తిని విని
తాడిత జన రోదన విని
సమ భావం సమ న్యాయం
శాంతి కాంతి ప్రగతి కొఱకు
వీర వరులు చేపట్టిన
వేయి శిఖల దివ్య చాపమే యిదీ!
అన్యాయం, అక్రమాలు
ఆక్రందన, ఆవేదన
తర తరాల పీడనలను
తరలింపగ పుడమి నుండి
వేల యువకు లెత్తినట్టి
విప్లవ శ్రీ జయ పతాకమే యిదీ!
భువి యంతా ప్రజల దనీ
దివి యంతా జనుల దనీ
హెచ్చిన గొంతున ప్రతినలు
ముచ్చటగా చాటి చెప్పి
ప్రజా సేన యెత్తినట్టి
ప్రగతి శీల క్రాంతి పతాకే యిదీ!

## ఎప్పుడదీ?

ఎప్పు డదీ? ఎప్పు డదీ?
విప్పారును శాంతి కాంతి?
సమ ధర్మం, సమ న్యాయం!
సమ సమాజ ముద్భవించు?
మనిషి మనిషి దోచుకొనని
మంచిరోజు లెపు డొచ్చును?
అన్యాయం అక్రమాలు
అంతరించు దిన మెప్పుడు?
ప్రజ లందఱు సుఖ శాంతుల
పల్లవించు దిన మెప్పుడు?

అంధ తమస మంతరించి
అరుణోదయ మెప్పు డగును?
మానవత్వ మధురిమలను
మధువు లొలుకు టెప్పుడు?
నాదే నని విశ్వ మంత
నరుడు పొంగు టెప్పుడు?

కార్మిక కర్షక లోకం
కలకల లాడే దెప్పుడు?
పండిన పంటలు సంపద
ప్రజలకు చెందే దెప్పుడు?
కనుల పండుగై జగతిని
కలలు పండు దిన మెప్పుడు?

# భుజం భుజం

భుజం భుజం కలిపి వేగ నడువరా!
భువిని దివిగ జేయ వేగ సాగరా!

నవభారతి పౌరుడ నని
నాదే యీ దేశమనీ!

కూడు గుడ్డ కొరత లేని
క్రొత్త సమాజము కొఱకు!
మనిషి మనిషి దోచుకునే
మాయ తెరలు తొలగింపగ!

మత, కుల మాఢ్యములు మాపి
మమత స్నేహములు విరియగ!
పుడమిని గల సంపదపై
పూర్తి హక్కు ప్రజల దంటు!
అభ్యుదయం, సుఖం, శాంతి
ఆశయమని దీక్ష బూని!
కోటి కోటి ప్రజల తోడ
కూడి క్రాంతి పథము నందు!

భుజం భుజం కలిపి వేగ నడువరా!
భువిని దివిగ జేయ వేగ సాగరా!

## ఎఱ్ఱ జెండా

ఎగురవేయరా! నీ యెఱ్ఱ జెండా!
ఎగురవేయరా! నీ క్రాంతి బావుటా!

ఎందరెందరో వీరుల
వీరోచిత త్యాగ చిహ్నా

ఎగురవేయరా! నీ యెఱ్ఱజెండా!
ఎగురవేయరా నీ క్రాంతి బావుటా!

అఖిల ప్రపంచపు శ్రామిక
యాదర్శపు జ్యోతి యిదే!
శ్రమజీవుల దిక్సూచిక
శాంతి, ప్రగతి చిహ్నా మిదే!

ఎగురవేయరా నీ యెఱ్ఱ జెండా!
ఎగురవేయరా నీ క్రాంతి బావుటా!

విప్లవ పోరాటములకు
వీర కర్మ యోధులకు!
వెను జూపని వీరవరుల
విడువని యూఅవ ప్రాణము!

ఎగురవేయరా నీ యెఱ్ఱ జెండా!
ఎగురవేయరా నీ క్రాంతి బావుటా!

ఎగురవేయరా ! నీ యెఱ్ఱ జెండా!
ఎగురవేయరా! నీ క్రాంతి బావుటా!

ఉరికంబము లెక్కినా
ఉచ్చులలో జిక్కినా!
ఆశయముల మఱపింపని
అమర దీపకళిక యిదే!

ఎగురవేయరా నీ యెఱ్ఱ జెండా!
ఎగురవేయరా నీ క్రాంతి బావుటా!

కష్టజీవు లంత గూడి
కలిసిపోవు బాట జూపి!
వెతల దీర్చి సుఖము నిచ్చు
వే వెలుగుల క్రాంతి రేఖ!

ఎగురవేయరా నీ యెఱ్ఱ జెండా!
ఎగురవేయరా! నీ క్రాంతి బావుటా!

అంబరమున యరుణుని వలె
నన్ని దేశముల నెగురుచు!
కార్మిక కర్షక జనులకు
కలిమి బలిమి కంటిపాప!

ఎగురవేయరా! నీ యెఱ్ఱ జెండా!
ఎగురవేయరా! నీ క్రాంతి బావుటా!

## పట్టు విడను

పట్టు విడను ప్రతిన విడను
ఇట్టట్టుల నే తొణుకను!

ఆశయాల కొఱకు నిలిచి
యర్పింతును నా ప్రాణము!

అరుణారుణ జగతి కొఱకు
తరుణారుణ ప్రగతి కొఱకు!
రక్తాక్షరముల వ్రాసిన
వ్రాతల నే మఱచిపోను!

ఉరికంబము లెదురైనా
ఉచ్చులలో నే జిక్కినా
వెను దిరుగను! వెనుజూడను!
విడువను నా తుది లక్ష్యము!

సమ ధర్మం, సమ న్యాయం
సమ సమాజ స్థాపనకై!
చేసిన నా ప్రతిన నిలుప
చిందింతును నా రక్తము!

యశము కొఱకు, కీర్తి కొఱకు
ఆశింపను స్వార్థములను!
మాతృదేశ ప్రజల సేవ
మఱచిపోని పరమార్థము!

# మృదంగం

మృదంగం! మృదంగం!
తరంగం! తరంగం!
మృదంగం మ్రోగిందీ!
తరంగం లేచిందీ!
చిరకాలపు దోపిడింక
చెల్లదనీ, చెల్లదనీ, చెల్లదనీ!
కలకాలపు దాస్య మింక
గతకాలపు కథ యనీ! కథ యనీ!
ప్రజా వాణి! ప్రజా వాణి!
పలికిందీ, పలికిందీ, పైకి లేచి!
భువి యంతా మాదనీ,
భూతల సంపద యంతా మాదనీ,
గొంతెత్తి, గొంతెత్తి
కోటి కోటి ధ్వనులతో అరిచిందీ!
ప్రజల పాట, ప్రజల మాట
పర్జన్యుని కేక వలే పలికిందీ!
మృదంగం ధ్వనులతో
అదిరిందీ! అణిగిందీ! పాత కాలం!
తరంగం అలలతో
తరలిందీ! మణిగిందీ! చీకు కాలం!
క్రొన్నెత్తురు మడుగులలో
క్రొత్త జగతి మొలకలెత్తి పుట్టిందీ!

# ఇటు మోదం! అటు ఖేదం!

అటు మోదం! ఇటు ఖేదం!
అటు శాంతి! ఇటు అశాంతి!
అంతస్థుల తారతమ్య
మంతరించు టెప్పుడో!
హెచ్చు తగ్గు భేదము లిల
విచ్చిపోవు టెప్పుడో?

విలాసాల విందులతో
ఖులాసాలు అచ్చటా!
ఆకలి పెనుభూతముతో
అలమటించు టిచ్చటా!

ఆకాశపు హర్మ్యములను
ఆట పాట లచ్చటా!
ఎండ వాన చలిగాలుల
బండ చాకి రిచ్చటా!

సకల సుఖము లంది పొందు
సౌఖ్య రాసు లచ్చటా!
స్వేదాశ్రువు లొలుకుతూ
చిరదాస్యము లిచ్చటా!

ఒకే విశ్వ వాసులం!
ఒకే భూమి బిడ్డలం!
ఈ అంతరు వెందులకు?
ఈ విభేద మెందులకు?

# దహిస్తోంది!

దహిస్తోంది! దహిస్తోంది!
దావానలం దహిస్తోంది!

తరతరాల దుష్కృతాలు
తరలింపగ పుడమినుండి!

దీనుల పేదల బ్రదుకులు
దిద్దుటకై పొగల సెగల
దారుణమగు గండశిలలు
తరిగి కఱుగ చూర్ణములై!

ఆకలి కేకలు మాన్పగ
ఆర్తుల యాపద మాన్పగ!
బలవంతుల ధనవంతుల
పైకి నెగసి చుట్టుముట్టి!

అన్ని మూల లంటుకుంది!
అఖిల జగతి యలుముకుంది!
సాంఘిక అన్యాయములు
సమసిపోవ మాపాలని!

క్రొత్త సూర్యు డుదయమొంది
క్రొత్త కాంతి నివ్వాలని!
ప్రాతనుండి సరిక్రొత్తని
పథము ప్రజలు నడవాలని!

## రగులుకుంది

రగులుకుంది అగ్ని కణం!
పగులుతోంది పాత యుగం!

జనవాహిని కడలి పోటై
కల్లోలం సృజించింది!

ప్రళయంవలె ప్రభంజనం
పరవళ్ళను ద్రొక్కింది!
పాత శకం పారిగింది!
పలుముక్కలు చెక్కలుగా!

అన్యాయం, అక్రమాలు,
అంతరించి పుడమినుండి!
నవ ధర్మం అలుముకుంది!
నవకాంతులు తొణుకుతోంది!

విశ్వరచన విజ్ఞానం!
విశ్వభవన నిర్మాణం!
జనవాహినికే గలదని
చాటుతోంది గొంతు నెత్తి!

అల్లోలం! కల్లోలం!
అస్తమించి పోయింది!
నరజాతికి క్రొత్తయుగం!
నాంది గీతి పాడింది!

# అడుగడుగున

అడుగడుగున భయం! భయం!
గడ గడ గడ గడ క్షణం! క్షణం!

రేపు మాపు రణం! రణం!
మనసునందు భయం! భయం!

తిండి కొఱకు! బట్టకొఱకు!
తిన్నని గృహ వసతి కొఱకు
మందు కొఱకు! మాకు కొఱకు!
అందని యా చదువు కొఱకు!

స్వేదానికి విలువ లేదు
శ్రమ శక్తికి విలువ లేదు!
ధనవంతుల నిర్ణయాలు!
ధారుణిలో చెల్లుబాటు!

మనిషి బ్రతుకు శాంతి లేదు!
మానవునకు చోటు లేదు!
మనిషి నడుచు దారులలో
మఱిగే నూనెల గోతులు!

పెరిగిన భయ విషవృక్షం!
పెల్లగించు తరుణ మెపుడు?
అణిగిన సంజీవి మొక్క
ఆకసమును నంటు టెపుడు?

## రాగం

రాగం తీస్తున్నా – నవగీతం వ్రాస్తున్నా !
లో పూచిన పుష్పం – నలుగురికీ అందిస్తున్నా !

నా రాగం షడ్జమ రాగం
నా గీతం ప్రబోధ గీతం!
నా పూచిన సుగంధ పద్మం
నవజీవన వికాస చిహ్నం!

వరాగం తీస్తున్నా – నవగీతం వ్రాస్తున్నా!
లో పూచిన పుష్పం – నలుగురికీ అందిస్తున్నా!

ధరణంతా సరోవరంగా
నరులంతా జల బిందువులుగ!
నే పూచిన పుడమిని ప్రజలకు
నిఖిలము నే మధువులు చిందెద!

వరాగం తీస్తున్నా – నవగీతం వ్రాస్తున్నా
నాలో పూచిన పుష్పం – నలుగురికీ అందిస్తున్నా!

నా సుందర సువర్ణ రేఖల
నవ కాంతుల పూర్ణత్వంలో
నా ప్రజలను నవ పథములకై
నడకల కిక వెలుగులు చిమ్మెద !

నవరాగం తీస్తున్నా – నవగీతం వ్రాస్తున్నా!
నాలో పూచిన పుష్పం – నలుగురికీ అందిస్తున్నా!

నవరాగం తీస్తున్నా - నవగీతం వ్రాస్తున్నా
నాలో పూచిన పుష్పం - నలుగురికీ అందిస్తున్నా!

నా పుష్పాడి రంగులు జిమ్మి
నవ ప్రభలను జాగృతి చేస్తా!
అందం, ఆనందం విరిసే
అమరత్వం సుస్థాపిస్తా!

నవరాగం తీస్తున్నా - నవగీతం వ్రాస్తున్నా
నాలో పూచిన పుష్పం - నలుగురికీ అందిస్తున్నా!

నా మధువులు జాలులు వారి
నా తేనెల తీపులు గ్రోలి!
సమభావం - సహోదరత్వం
శాంతులు ధర ఉదయించాలి!

నవరాగం తీస్తున్నా - నవగీతం వ్రాస్తున్నా
నాలో పూచిన పుష్పం — నలుగురికీ అందిస్తున్నా!

నా పరిమళ సుగంధ వీచులు
నవజీవన సూర్యోదయమై!
నరజాతికి మహోదయంగా
నలుదిశలకు పయనం చేస్తా!

నవరాగం తీస్తున్నా - నవగీతం వ్రాస్తున్నా!
నాలో పూచిన పుష్పం నలుగురికీ అందిస్తున్నా!

# గెరిల్లా యోధుడు

[ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధంలో గెరిల్లా యోధుడు తాంత్యాతోపే తన గెరిల్లా సహచర వీరులను ప్రబోధించిన విధము]

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి !
శత్రువులదె! అదిగదిగో! చండాడండీ! పై పైబడి !

ప్రక్కపోటు పొడవండీ!
పక్షివోలె యెగరండీ!
చుక్కలు తెగి పడినట్టులుగా
సూటిగ శత్రువులపై బడుడీ!

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి !
శత్రువులదె! అదిగదిగో! చండాడండీ! పై పైబడి !

మన దేశము నాక్రమింపగా
మన సంపద నపహరింపగా!
వచ్చిన యీ పరదేశీయుల
చెచ్చెర పరుగిడ జేద్దాము!

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి !
శత్రువులదె! అదిగదిగో! చండాడండీ! పై పైబడి !

మన శత్రువు బలవంతుడురా!
మారణాయుధాల్ గల వెన్నో!
ఎదుర, వెనుక, ప్రక్కల నుండీ!
చెదరజేసి యోడిద్దాము!

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి !
శత్రువులదె! అదిగదిగో! చండాడండీ, పైపైబడి !

వెనుకనుండి పైబడదాము!
వేగమె కను మఱుగవుదాము!
ప్రక్కనుండి పోటులు పొడిచి
పరుగున వే దాగుందాము!

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి !
శత్రువులదె అదిగదిగో! చండాడండీ పైపైబడి !

కడలిపోలె లోగొందాము
సుడులు చుట్టి మడియిద్దాము!
పెనుగాలుల వలె పడదాము!
పెడబొబ్బలు పుట్టిద్దాము!

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి
శత్రువులదె అదిగదిగో! చండాడండీ! పైపైబడి!

అదురు పుట్టి బెదరగవలెరా!
కదలి దేశమును విడవలెరా!
భారతీయ వీరులు అనగా
భయముతోడ పరుగిడవలెరా!

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండీ !
శత్రువులదె అదిగదిగో! చండాడండీ! పైపైబడి !

# భూమితల్లి బిడ్డలు

భూమి తల్లి బిడ్డల్లారా!
పుడమి తల్లి తనయుల్లారా!
శ్రమచేసే శ్రామికులారా!
శాంతిలేని జీవుల్లారా!

మీ హక్కులు చాటండీ!
మీ హద్దులు తెలుపండీ!

ఎన్నాళ్ళీ స్వేదాశ్రువులు
ఎన్నాళ్ళీ వేదన రోదన?
ఎన్నాళ్ళీ దారుణ నరకం?
ఎన్నాళ్ళీ నీచపు బ్రతుకులు?

తొలిసంజల పొద్దుల నుండీ!
మలిసంజలు మా సేవలకు!
కుండ పోత వానల్లోను,
కుత కుత మను ఎండల్లోను.

ఋణము తీరికన్నది లేక
శ్రమియింతువు కద కూలన్నా!
కడుపు నిండ తిండే లేదు
కట్టబట్ట లేనే లేదు!

బ్రతుకంతా నిరాశతోనే
బాధలతో కృశించుతావా ?
పండించిన పంటనంతా
పరులకు అర్పించుతావా ?

పొగలురేగు యంత్రములందు
సెగలు చిమ్ము భూగర్భములో
స్వేదాశ్రువులను తొణికిస్తూ
చిరదాస్యములో తపియిస్తూ!

నవసంపదలను సృజియించీ
నవజీవనమును కల్పించీ!
ఆకలితో మలమల మాడి
ఆవురుమని తపియిస్తావా ?

బ్రతుకు భారమై నిరాశల
బాధలతో విలపిస్తావా ?
ఇల్లులేక వాకిలిలేక
తల్లడిల్లి పోతుంటావా ?

భూమంతా మీదేకదరా !
భువిసంపద మీదే కదరా !
ఆకాశము, భూమండలము
అణువణువును మీదేకదరా !

కార్మికుడా ఓ కర్షకుడా !
కలిమికంత కర్తవుకదరా !
మీ శక్తి శ్రమ బిందువులే
మిలమిల గద యీ ధరణంతా !

పరులకలిమి తిననేర్చిన యీ
బలవంతులు, పరాన్న భోక్తలు !
మీ కలిమిని గ్రసించినారా?
మీదైనది హరించినారా ?

మిము దారిద్రులుగా జేసి
మిము దాస్యములో ముంచేసి!
అధిపతులై సంపదకంతా
ఆరని సుఖముల మునిగారా !

అందలములపై తా మెక్కి
అధిపతులై కూర్చున్నారా !
బానిసలుగ పల్లకి మోసే
పతితులుగా మిము జేశారా ?

లెండి ! లెండి ! నిదురను విడిచి
రండి! రండి! ముందుకు వేగ
మీ హక్కులు చాటండీ!
మీ హద్దులు తెలుపండీ!

"ధాత్రిని గల సంపదలన్నీ
తరగని యీ సుఖభోగములు
మా స్వేదాశ్రువులను ఫలించి
మారిన మీ సుఖ సంపదలు !

మా సంపద మా కర్పించీ,
మరలండీ ! పో! పో! పొం"డని!
మీ హక్కులు చాటండీ !
మీ హద్దులు తెలుపండీ !

# ఆవులకాడి బుడ్డోడు

ఆట పాటలను దూరం జేసీ!
ఆవుల వెంటా అడవులు తిరుగుతు
చిన్ననాడే జీతం కుదిరావా!
ఓ పాలబుగ్గలా బంగారుకొండా!
చిన్ననాడే-జీతం కుదిరావా!

కోడి కూసినా వేళను లేచీ
కునుకు పట్టే వేళదాకా
ఇష్టం లేని-కష్టం చేసేవా?
ఓ పాలబుగ్గలా బంగారు కొండా!
చదువు సంధ్యలకు స్వస్తే చెప్పావా?

పేడ దీసీ, పిడక లేకీ
పెద్ద వాకిలీ అంతా చిమ్మీ
నీళ్ళు తోడీ-గాబులు నింపావా?
ఓ పాలబుగ్గలా బంగారుకొండా!
ఆవు లన్నిటికి నీళ్ళే తాపావా!

దొంగ బర్లను, పోటెద్దులను
చెంగున యెగిరే-కోడె దూడలను!
అడవుల మేపుచు-నలనట చెందేవా?
ఓ పాల బుగ్గలా బంగారు కొండా!
అడలిపోతూ ఆవురు మంటావా!

ఎంత చాకిరీ చేసిన గూడ
ఇంత గంజీ మెతుకే లేదు!
ఆకలితో శే_అలమటించుతా వా?
ఓ పాల బుగ్గలా బంగారు కొండా!
అలసిపోయి నీవు నిదురే పోతా వా?

తిట్టు తినని రో జొక్కటి లేదు!
తీయని మెప్పు ఒక్కటి లేదు!
బండ చాకిరిని_ఎండుక పోయేవా?
ఓ పాల బుగ్గలా బంగారు కొండా!
ఎండ వానలను ఒంటిగ తిరిగేవా?

ఇంతేగద! నా బ్రతుకు భాగ్యమని
చింత చేయకుర! చిన్నారి పాపడ!
మంచి దినాలు_రానున్నావిరా!
ఓ పాల బుగ్గలా బంగారు కొండా!
మంచి రోజులు రానున్నావిరా!

ఆట పాటలను దూరం జేసీ
ఆవుల వెంటా అడవులు తిరుగుతు
చిన్ననాడే జీతం కుదిరావా!
ఓ పాల బుగ్గలా బంగారు కొండా!
చిన్ననాడే జీతం కుదిరావా!



పూ లు

# సముద్ర కెరటాల్

పోటెత్తిన జన సముద్ర కెరటాల్
వుడ మంతా లేచినవి యెందుకని?
అటు పోటు యీ యలల ప్రతిధ్వని
అవనీ తలమును ముంచిన దెందుకు?

పెను తూఫాను అటు వీచే దెందుకు?
భీభత్సము సృజియించే దెందుకు?
అణచి వేయబడు నార్తుల రోదన
ఆకాశానికి లేచిన దెందుకు?

కష్టానికి తగు ఫలం లేదనీ
కారుణ్యానికి చోటే లేదని
ఆకలి, దారిద్ర్యానికి గురియై
అలమటించు ప్రజ మేలుకొన్నది!

అడుగుతోంది తమ హక్కు లేమిటని!
హద్దు లేమి టని గర్జిస్తున్నది,
సృష్టించిన యీ సంపద లన్నియు
స్పష్టముగా మావే యని పలుకుచు!

సుందర సురు చిర శోభలు చిందే
అందమైన సంస్కృతి ధ్యేయ మనీ!
సప్త వర్ణముల యింద్ర చాపముగ
సప్త ఖండములు వర్ధిల్లాలని!

నిత్య కల్యాణ పచ్చ తోరణము
నిఖిల ప్రపంచం విలసిల్లా లని!
కంఠ మెత్తి తమ అదర్శాలను
కలకల మని చాటే దిందులకే!

మార్పుల కోసం, చేర్పుల కోసం,
మరో ప్రపంచం రాకడ కోసం!
అడుగడుగున తమ రక్తాశ్రువులను
అర్పిస్తూ, తర్పణ గావిస్తూ!

జన వాహిని తరగలు తరగలుగా
చదలు, భువిని గప్పిన మహోత్సవము!
చుక్కలు దాటే, భూమి చలించే,
సూటిగ ధ్వనించు సుదీర్ఘ గర్జన!

పోటెత్తిన జన సముద్ర కెరటాల్
పుడమంతా లేచినవి యిందుకే!
ఆటుపోటు ఈ యలల ప్రతిధ్వని
అవనీతలమును ముంచిన దిందుకే!

## కను కొలుకుల మాటున

కను కొలుకుల మాటున అదిగో!
కదిలిందొక నవలోకం!

మనసు తెరల మాటున అదిగో!
మెదిలిం దొక జనలోకం!

ఆకలి దుఃఖములే లేనిది
అలసట కష్టములే కానిది!
దోపిడి పీడనలే లేనిది!
దురపిల్లే ప్రజాళి లేనిది.

శ్రమజీవుల రక్తము నూడ్చే
జార చోరు లచ్చట లేరు!
మానవత్వ మహిమను తెలియని
మానవు లట కానగరారు!

నరుని నరుడు దోపిడిచేయుట
నామమాత్ర మైనను లేదు!
పుడమిలోని ప్రతివస్తువుపై
పూర్తి హక్కు ప్రతి మానవునిది

కలిసి మెలిసి కష్టించెదరు
కలిమి ననుభవింతు రందఱు!
పూర్ణ మానవత్వము తోడుత
పూవులవలె వికసించెదరు!

## ఓ హొ బోయిలార!

ఓ హో బోయీలార! ఓ హో బోయీలు!
ఓ హో బోయీలార! ఓ హో బోయీలు!

పల్లకి మోయండిరా! పట్టెడన్నం కోసం!
కుదువు కదుపులేక కూడి నడవండిరా!

ఎచ్చా పల్లాలు దాటి వచ్చే గోతులు దాటి
పచ్చాని బయలంత చొచ్చు కెల్లాలిరా!
కొండ కోనాలు దాటి–కోయగూడాలు దాటి
వచ్చే మేఘాలు చూసి ఒరిగీ నడవాలిరా!

కడుపు కాలుతున్న–కళ్ళా తిరుగుతున్న
అలిసి సొలసీన గూడ–అడ్డం బడినా గూడ
పల్లేళ్ళు గుచ్చుకున్న – పల్గూరాళ్ళొత్తుకున్న
రక్తాలు గారుతున్న – రణమైనా గాయమైనా!

మారాజుకు కోపమొస్తే – మాడీ సావాలిరా!
చింతా బరికేల తోటి – సిట్లూతాదీర వొల్లు!
నిలువూ గాళ్ళతోను – నిలుసుండ బెడతాడు!
కక్కు–మని అప్పులను – డొక్కా– సీలుస్తాడు!

రాతరాసిన బెమ్మ రాలీరప్పాలుగాను!
కూసీన శాస్త్రాలు కూలీ మప్పాలుగాను!
మా బతుకు లింతేన మాయదారీశ్వరుడ!
కనికరము లేకుండ–కట్ట బెడుతుండావు!



పూల

# నడవండి !

నడవండీ! నడవండీ!
నడవండీ ముందుకు మున్ముందుకు!

నవసమాజమును నిర్మించుటకు
నడుములు కట్టి నడవండీ!

పరిశ్రమలతో, ప్రాజెక్టులతో
పాడి పంటలను తోణికించి!
కూడు గుడ్డలకు లోపం లేని
క్రొత్త సమాజం నిర్మిద్దా!

మత కుల భేదము, వైరము మానిపి
మానవత్వమును వెలయించి!
సాంఘిక అసమానత్వము మాపి,
సమసమాజమును సృజియిద్దాం!

ఆకలి, పీడన, దారిద్ర్యములను
అంతముచేయగ అందరు రండీ!
సర్వజనులకు సుఖమును గూర్చే
శాంతి రాజ్యమును స్థాపిద్దాం!

నడిపండీ! నడవండీ!
నడవండీ ముందుకు మున్ముందుకు!
నవసమాజమును నిర్మించుటకు
నడుములు కట్టి నడవండీ!

# కంకణ ధారణము

కంకణ ధారణము చేసి
కదలవోయి ముందుకూ !

నవకాంతుల వెలుగులలో
నవసమాజ పథములకూ !

చీకటి తెరలను దాటి
జీర్ణ శీర్ణ బ్రతుకు మాపి!
స్వర్ణ జగతి నిర్మింపుము
సర్వ జనులు ప్రగతి నొంద!

బ్రతుకే ఒక భారముగా
బ్రతుక లేని పీడితులకు!
మధుర జీవితము నిచ్చెడి
మార్పు జెందు దారులకు!

ముందు నడిచి, ముందు నిలిచి
ముసిరే ఆపదల దాటి!
చిరలక్ష్యము సాధనకై
చెదరకు మది, వెను జూపకు!

నీ ప్రజలకు సేవ జేసి
నిర్మింపుము ప్రగతి బాట!
నీ ప్రతిజ్ఞ నెఱవేర్పగ
నీ ప్రాణము లర్పింపుము !

# శాంతి గీతం

విశ్వ మంత విమల శాంతి వెల్లివిరియగా!
విశ్వ వీణ మీటి శాంతి గీతి పాడెదా!

మతము కులము భేద భావ మంతరింపగా!
జాతి వర్గ భేదము లిల సమసిపోవగా!
నవజీవన నూత్న జ్యోతి నవ్య కిరణముల్
విశ్వ వ్యాప్తి నొంద విమల గీతి పాడెదా!

ప్రతిదేశము ప్రతిప్రాంతము ప్రగతినొందగా
పరిశ్రమలు ప్రాజెక్టులు ఫలితిమివ్వగా!
సర్వ జనులు సుఖము నొంది సౌఖ్య మొప్పగా
అమర లోక భవ్యగీతి తసి పాడెదా.

చేయి చేయి కలిపి జనులు స్నేహ మొప్పగా
అడుగులో అడుగువేసి అంద మొప్పగా!
ప్రగతి మార్గ యాత్రికులై గమ్యము జేరగా
దివ్య సుఖద క్రాంతి గీతి దిశల పాడెదా!

అజ్ఞానపు తిమిరము లిల నస్తమింపగా
విజ్ఞానపు సూర్యప్రభలు విస్తరింపగా!
మానవుడే దేవతగా మారునట్లుగా
విశ్వ ప్రేమ విమల గీతి ప్రీతి పాడెదా!

లేమితనము పరపీడన లింకిపోవగా
నరుని నరుడు దోచుకొనుట కరిగిపోవగా!
విశ్వ ప్రజలు సోదరులై వేడ్క నొందగా
పుణ్యలోక భవ్యగీతి పూని పాడెదా!

# మాతృ వందనం

వందనం యిదె వందనం !
తెలుగు తల్లికి మా వందనం!
ఆఱు కోట్ల ప్రజలను కని పెంచిన
అమృత మూర్తి కిదె అంజలులు !
వందనం యిదె వందనం!
తెలుగు తల్లికి మా వందనం!

తుంగభద్ర ముచుకుంద గోదావరి
పొంగిపొరలు శ్రీ కృష్ణవేణులను
రంగుమీరు నవధాన్య రాసులను
రాజిల్లెడి మా అన్నపూర్ణ కిదె!

శిల్ప, చిత్రకళ, నాట్య రీతులను
శ్రీకరమా బహు తేనె పలుకులను!
తీయని రాగము, కమ్మని కవితను
తీరుగ నేర్చిన కళామతల్లికి!

దేశ భక్తులను త్యాగ శీలురను
ధీరుల వీరుల యోగి పుంగవుల!
కడుపు చల్లగా కని పెంచిన మా
కన్నతల్లి శ్రీ ఆంధ్ర మా కిదె!

భారత మాతకు ముద్దుబిడ్డగా
భావి ప్రగతికి వేగుచుక్కగా!
విశ్వ శాంతికై వీణను మీటుచు
విమల గీతమును పాడెడి తల్లికి!

# చిన్ని తమ్ముడా!

తెలిసికొనుము! తెలుగు బాలుడా!
నీ జాతి చరిత!
తెలిసికొనుము! చిన్ని తమ్ముడా!

శాతవాహనుల నుండి
జరిగిన నీ జాతి చరిత!

తెలిసికొనుము! చిన్ని తమ్ముడా!
నీ జాతి చరిత!
తెలిసికొనుము! చిన్ని తమ్ముడా!

తెలుగు భాష తేటదనము !
తెలుగు పాట తీపి తనము !
తెలుగు కత్తి చురుకు దనము
తెగువ! బలిమి! సాహసములు!

నన్నయ, తిక్కన, పోతన
నవరంగుల దివ్య కవిత!
త్యాగరాజు క్షేత్రయ్యల
రాగ సుధల తెలుగుపాట!

హంపీ యమరావతులను
అపురూపపు శిల్పములను!
కూచిపూడి గొల్లభామ
కూర్మి నాట్య భంగిమలను!

గలగల పారేటి నదులు
బలబల పండే పొలములు!
అన్నపూర్ణ ఆంధ్ర భూమి!
అఖిల సస్యములకు నెలవు!

దేశభక్తులకు నెల విది
ధీరుల కిది పుట్టినిల్లు!
బాల చంద్ర, అల్లూరులు
ప్రభవించిన పోతు గడ్డ!

తెలుగు ప్రజల, తెలుగు నేల,
తెలుగు భాష ప్రగతి కొఱకు!
దేశ భక్తి, మాతృ భక్తి
ధీ శక్తిని ముందుకు నడు!

అఖిల భారతావనిలో
ఆఱుకోట్ల మాంధ్రులము!
భారత మణి హారము లో
భవ్య మణిర తెలుగు భూమి!

# జోహారులు !

అమర వీరు లందరికీ జోహారులు!
ఆత్మార్పణ వీరులకు నివాళులు!

దేశ దాస్య శృంఖలములు ఛేదింపగా
దేశ ప్రజల దాస్యమును తొలగింపగా!
అసువుల తృణప్రాయముగా ధారబోసినా
అఖిల దేశభక్తులకు జోహారులు!

స్వేచ్ఛా స్వాతంత్ర్యములు జన్మహక్కనీ
శ్వేతజాతి పాలనమును శిథిల పరుపగా!
అడుగడుగున రక్త మొలికి ధరణి కొరిగినా!
అజ్ఞాతపు యోధులకు నివాళులు!

వీర ఖడ్గములను దాల్చి ధీర వనితలై!
పరదేశపు పాలకులను పారద్రోలగా!
కదనములో కదముద్రొక్కి యసువు లొదిలినా!
క్రాంతి వీర నారులకు జోహారులు!

మీ యడుగుల జాడలలో మేము నడచెదం!
మీ యాశయ సిద్ధికొరకు మేము పోరెదం!
సమసమాజ స్థాపనకై సాగిపోయెదం!
స్వాతంత్ర్యపు జ్యోతి నెపుడు కాపాడెదం!
అమరవీరు లందరికీ జోహారులు!
ఆత్మార్పణ యోధులకు నివాళులు!

# బాలలకు

బడికి రోజూ మనము రావాలి!
పాఠాలు తియ్యగా చదవాలి!

గురువు చెప్పిన దంత
గుర్తుగా నుంచుకొని

మంచి నడతను గలిగియుండాలి!
మంచివాళ్ళని పించుకోవాలీ!

తల్లిదండ్రుల భక్తి గొలవాలి!
తాత దీవెన లెపుడు పొందాలి!

పెద్ద లందఱికిని
వినయమును దెలుపుతూ

ప్రేమతో చిన్నలను చూడాలి!
ప్రియముగా మన మంత మెసలాలి!

గురువులను భక్తితో గొలవాలి!
కోరి విద్యల నెల్ల పొందాలి!

వ్రాయుచు, చదువుచు
వల్లె వేయుచు రోజు

అన్ని విద్యలు నేర్చుకోవాలి!
అన్ని కళలను తెలిసి కోవాలి!

కలిసి బాలల మంత మెలగాలి!
కథలు చదువుకుంటు గడపాలి!
ఆట పాటల లోన
మేటి పోటీలతో
కిలకిలా మన మంత నవ్వాలి!
కీచులాటలు మనము మానాలి!

చిలుకవలె పలుకులను పలకాలి!
చేరి కోయిలవలే పాడాలి!
వనమయూరము వలె
వయ్యార మొలికించి
మధుర నృత్యము మనము చేయాలి!
మధువు లోకమునకు పంచాలి!

దేశ మాతను పూజ చేయాలి
దేశ ప్రజలను ప్రీతి జూడాలి!
దేశాభ్యుదయమునకు
చేయూత నిచ్చుచు
దేశభక్తుల జాడ నడవాలి!
తెలుగుతల్లికి కీర్తి తేవాలి!

# అందాల జాబిల్లి!

అందాల జాబిల్లి రావమ్మా!
ఆడుకుందాము వేగ యిటు రావమ్మా!

చుక్కలా మధ్యనా
చక్కగా కూర్చుండి!
ఎక్కడెక్కడి కథలు
ఎన్నెన్నో చెబుతావు!

నా కొక్క కథ చెప్పి
నన్ను నవ్వింపవా?
వెన్నెలల సొగసుతో
నన్ను పులకింపవా?

నీ జింక నొకసారి
నిలిచి చూపింపవా?
నీ పొన్న పువ్వులను
నిండు దోసిలి నివ్వు!

నీ వెండి నవ్వులను
నీవు నాకిస్తేను!
నే ఆడి! నే పాడి!
నిన్ను నవ్విస్తాను!

అందాల జాబిల్లి! రావమ్మా!
ఆడుకుందాము వేగ యిటు రావమ్మా!

# నా కోర్కె

క్రొత్త లోకమ్మునకు
క్రొత్త జీవితమునకు
తొలికోడి కూతనై
పలుక నా కోర్కె!

మనుజు లందఱు నూత్న
మధురానుభూతులను!
స్నేహ వారాసిలో
చెలగ నా కాంక్ష!

విశ్వ జను లందఱును
విమలమగు హృదయముల
ఆనంద జగతిలో
వలర నా కోర్కె!

వివిధ సంస్కృతులతో
విలసిల్లి జగమంత
మింటి చుక్కల వోలె
మెలగ నా కాంక్ష!

క్రొత్త లోకమునకు
క్రొత్త జీవితమునకు!
తొలికోడి కూతనై
పలుక నా కోర్కె!

# జయ జయ!

జయ జయ మంగళ రూపిణీ!
జయ జయ భారత భారతీ!
వందన మిదె గైకొను మమ్మా!
వరము లొసంగుము! మా యమ్మా!

నిఖిల విద్యలను నిగమ శాస్త్రముల
నిండిన తల్లివి నీవేగా!
చక్కని పలుకుల సరసత నిచ్చి
సాహితి విద్యను మా కిమ్మా!

విద్యా బుద్ధులు, వినయ శీలమును,
విమల జ్ఞానమును మా కిమ్మా!
పుట్టిన మట్టిని పూజలు చేసే
పుణ్య సంస్కృతిని మా కిమ్మా!

వీణాపాణీ! వేదసారమా!
విశ్వరూప! సత్కీర్తి తేజమా!
మార్గదర్శివై మము నడిపింపుము!
మా నమస్కృతులు గైకొనుమమ్మా!

జయ జయ మంగళ రూపిణీ!
జయ జయ భారత భారతీ!
వందన మిదె గైకొనుమమ్మా!
వరము లొసంగుము! మాయమ్మా!

# సమ భావం

సమ భావం! సహోదరత్వం!
శాంతి! ప్రగతి! మా ధ్యేయం!

నవభారతమే! నవ సమాజమే!
నవజీవనమే మా లక్ష్యం!

మత కుల భేదములను మాన్పి
మానవు లంతా ఒకటేనంటు
సమ సమాజమును స్థాపిద్దాం!
సహోదరత్వం వెలయిద్దాం!

అన్ని రంగముల అభ్యుదయమును
ఐకమత్యమును స్థాపిద్దాం!
సిరి సంపదలు! చిర సౌఖ్యములు!
చిందే దేశము నిర్మిద్దాం!

దారిద్ర్యం, దీనత, అన్యాయం!
తరతరాల పీడనలను మాన్పి
శాంతి పథంలో పయనిద్దాం!
శాంతి పథంలో జీవిద్దాం!

సమ భావం! సహోదరత్వం!
శాంతి! ప్రగతి! మా ధ్యేయం!
నవ భారతమే! నవసమాజమే
నవ జీవనమే మా ధ్యేయం!